సంపుటము 4] డిసెంబరు, 1917 [సంచిక 6

# బాలమిత్ర




## క్రీస్తును దర్శించినవారు

క్రిస్మసునకు మీ స్నేహితు డెవడైనను మనకు బహుమానము యిచ్చినయెడల, మనము వాటిని దాచిపెట్టక అంద

టికి యేలాగున చూపుదుమో ఆలాగునే మన కందరికి ఒక బహుమానము యివ్వబడియున్నది. ఆ బహుమానము యేదన, మన ప్రభువైన యేసుక్రీస్తు. ఈయనను మనము దాచిపెట్టకూడదు. ఇది మన క్రైస్తవ జీవనములో ఒక ముఖ్యమైన బ్రతుకు. మనకు అనేక దానములు గలవుగాని అన్నిటికంటె యెక్కువైనదానము గనుక మన మీ దానమునుగూర్చి యెక్కువగా సంతోషించవలయును.

1. ప్రవక్తలు, యేసును చూచినారు. ఏలాగనగా, మనము దుర్భిణిద్వారా దూరమునయున్న వస్తువులను చూడగా యేలాగు దగ్గరయున్నట్టు కనబడునో ఆలాగుననే బైబిల్ అను దుర్భిణిద్వారా వారు చూచియున్నారు. ప్రస్తుతము మనముకూడ ఒకటి పట్టుకొనియున్నాము. అది దైవ వాక్యము. దీనిద్వారా అంత్యదినమున మన మాయనద్వారా మోక్షము చేరగలమనినమ్మి ఆనందించుచుందుము.

2. ప్రవక్తలైతే ఒక దుర్భిణిద్వారా యేసును చూచి యున్నారుగాని గొల్లలు దూతలద్వారా ఆయనను చూచి యున్నారు, గనుక వారు ధన్యులు.

3. హన్న, సిమియోను అనువారు గొల్లలతరువాత యేసును చూచియున్నారు. వారు యెల్లప్పుడు గుడికి వెళ్లుట ద్వారా ఆయనను చూడగలిగిరి. మనము చూడవలయునని

కోరిన ఒక గుడిగలదు. అది క్రైస్తవసంఘము. గనుక మన మీ సంఘములో యెల్లప్పుడు హత్తుకొని యుండవలయును.

4. జ్ఞానులు యేసును చూచుటకు సాధనము నక్షత్రము మన మొకసంగతిని విచారించుదము. ఆ దూతలు యెందుకు జ్ఞానులయొద్దకు వెళ్లలేదుఅనగా అన్యులైనవారియొద్దకు దేవుని దూతలను పంపిన వారు దయ్యమనుకొందురు. ఎందుకనగా దూతలనగా యెవరో వారికి తెలియదు గనుక ప్రియతండ్రి ప్రతివారి హృదయములు ముందుగా యెరిగియుండి యీ విధముగా తెలియజేసెను.

5. బైబిల్, మనము క్రీస్తును చూడగోరినయెడల మనము బైబిల్అను సత్యవేద గ్రంథము మూలముగా గాక మరి యేవిధముగానైనను చూడలేము. అందరు చేసినపనులు యిందులో నెరవేరి పూర్తియాయెను. గనుక మనము అను దినము ప్రార్థనద్వారా బైబిల్ చదువగలిగిన క్రీస్తును చూడ గలము, మాట్లాడగలము, మనము అడిగిన మనవులకు వెంటనే ప్రత్యుత్తరము అనగా జబాబు పొందగలము.

# క్రిస్టమస్ పద్యములు



చం. పొలుపుగ గాబ్రియేల్బరమ పూరుషుఁడొక్కరుఁడేగి మేరితో
లలనరో! మంగళంబనుచు లాలితమొప్ప వచంబులన్ గడున్
గలవరమందునట్లు వర కన్నియకుం దెలిపెన్ సురక్షణా
తులిత సువార్తభూజనుల తోరఁపుహర్షము పొంగునట్లుగా.

కం. తొలుతను వక్తలు బల్కిన
పలుకులు నెఱవేఱునట్లు ప్రభుఁడేనాతగన్
బొలతికిఁ బుట్టెను దానుని
బలువగు రూపంబుఁ దాల్చి పాపులఁ గావన్.

కం. రాతిరి కన్నెకుమారుఁడు
బేతలెమను పురమునందు వెలసెన్ బ్రభుఁడై

యాతరి దూతలసైన్యము
ఖ్యాతిగఁ బ్రకటించె మహిమ గగనంబంటన్.

సీ. పాలుపాఱు బేథలేము ♦ పురములోఁ బదితొమ్మి
దవ శతాబ్దము క్రిందఁ ♦ దఱలెయేసు
ఘనదైవజనితైక ♦ తనయుఁడై పరలోక
నెలవును బాసి తా ♦ నిలజనించె
కడుబీదకన్నియ ♦ గర్భానఁబడి మర్త్య
దేహంబు ధరియించె ♦ దీనగతిని
పాపకూపంబునఁ ♦ బడి మూల్గునరసంత
తినిఁగావ నవతార ♦ మును వహించె.

తే. గీ. అహహా! దివియేడ భువియేడ యనఘుఁడేడ!
దురితనరుఁడేడ సంబంధ మరయఁగలదె?
దైవప్రేమాస్వరూపమున్ దనరఁజూపు
చేవగల నిదర్శనమింకఁ జెప్పఁగలదె?

సీ. పరమబోధలచేతఁ ♦ బాపచీఁకటిఁబాపి
నిత్యసౌఖ్యమునిచ్చు ♦ సత్యరూపి
స్వర్గమార్గముఁదప్పి ♦ సాధించుజనులకు
సరళమార్గముఁజూపు ♦ సరణికర్త
పలురోగములఁదాకి ♦ బాధనొందినవారి
కరయశుద్ధికిని సి ♦ ద్ధౌషధంబు
బలిచేత దైవశా ♦ పముమార్చి దేవునిన్
మన తండ్రిఁజేసిన ♦ మధ్యవర్తి
మృతులను బ్రతికించి ♦ మెప్పొంది దైవబ
లోద్ధతిన్ జూపిన ♦ యూవిదనుతుఁడు

దిక్కు మాలినవారి ♦ దీనమొఱాలించి
దిక్కు గల్గించిన ♦ దివ్యఘనుఁడు
తే. గీ. జగము హర్షమందగ దాస జనములలర
బీదమరియాంబ గర్భాన వెలసినట్టి
సుదినమేగదా! క్రిస్టమస్ శుభముమీకు
గలుగుగాక! యీయవనిలోఁ గాఢముగను.

---

# మన దినము

ప్రియ పిల్లలారా! జబ్బుపడిన సిపాయులకు సహాయము చేయుటకు మీకు ఇష్టమున్నదా? అట్లైతే మీ పైసాలు, మీ అణాలు, మీ బేడలు, మీ పావలాలు, మీ రూపాయలు, జాగ్రతగా దాచిపెట్టి డిసెంబరు 12 వ తేదికి లోగా మీ ప్రియ బాలమిత్రయైన మెకాలి దొరసానిగారికి పంపించుడు. ఆమె నీ పేరట సిపాయులకు పంపెదరు. ఆమె అడ్రసు గుంటూరు.

మన వైస్రాయిగారు డిసెంబరు 12 తేదిని "మన దినము"గా నేర్పరచి యున్నారు. మనము పంపించిన సొమ్ము జబ్బుపడిన సిపాయులకు సహాయము చేయుటకు ఉపయోగింపబడును.



పిల్లలారా! మన మందరము పప్పుగాని, మిఠాయిగాని కొనకుండా మన శక్తికొలది ఆ జబ్బుపడిన ధైర్యముగల సిపాయులకు ఇచ్చెదము గదా?

# ప్రకృతి పాఠములు

## 40 వ-పాఠము

## కండరములు

(గతసంచిక శేషము)

ఇదివరకు కండరములెట్లు ఎముకలను కదలించునో తెలిసికొని యుంటిమి. ముఖమునందలి ప్రతి చలనమును కండరములవలననే కలుగుచున్నది. వీటివలననే ముఖవర్చస్సు అనేక విధములుగా మారుచున్నది. నీవు సంతోషముతో నుండి నవ్వునప్పుడు నోటికొనలు పైకి కండరములచే లాగబడును. నీవు విశేషించి నవ్వినయెడల నోరంతయు తెరచుకొనునుగదా అప్పుడు కండరములే పనినిజేయును. ఎవరైనను నవ్వునప్పుడు కొంచెము గుర్తించుము. నోరు తెరువబడుట మాత్రమే గాక కండ్లకు క్రిందుగా ముఖము ముడుతలు బడును. నోటి కండరములు పెద్దవిగా పైకి లాగబడినందున చెక్కిళ్లు లావై అట్టి ముడుతలు కాన్పించును. నవ్వాటలో కండ్లు చాల సహాయపడునని కొందరందురు గాని కండరముల సహాయము వలననే అట్లు జరుగుచున్నది. అప్పుడు కండ్లలో ఆనందము కనుబడుటకును కండర సహాయమే

ప్రధానమైనది. కండ్లుమూసికొనికూడా నవ్వవచ్చును. చిన్న బిడ్డలు నిద్రించునప్పుడు వారిముఖముపై చిరునవ్వు కలుగుట అనేకమారులు చూచియుండవచ్చును. వారి కేదో మంచికల పట్టినందున అట్లు నవ్వుదురు.

మరికొన్ని కండరములు మూతికొనలను క్రిందకులాగును. అప్పుడు ముఖము మాడ్చుకొన్నటుల కనబడును. ఆదే కాలమున కనుబొమ్మలును ముడుచుకొనిన దుఃఖమును, కోపమును ముఖమునం దగుపడును. సంతోషించు ముఖమునకును, దుఃఖించు ముఖమునకును భేద మెక్కడ నున్నది? నోటి కొనలయందును కనుబొమలయందు మాత్రమే. అప్పుడు "వాడు ముఖము మాడ్చుకొన్నాడు" అను మాటలు విని యుందువు. అప్పుడు కనుబొమలును నోటికొనలును క్రిందికి అగబడుచున్నవి.

కొన్ని జంతువులకు మనకు లేని కండరములు కొన్ని ముఖమునం దున్నవి. సాధారణముగా అవి పోరాడునప్పుడీ కండరములను లాగినందున వాని పెదవులు లాగబడి వాటి పొడవైన పండ్లు కనబరచును. మనుష్యునికి తప్ప సంతోషమును, దుఃఖమును, కోపమును కనుపరచు కండరము లితర జంతువులకు లేవు. కుక్క సంతోషమును కనుగొనవచ్చునందు వేమెం. అప్పుడది తనతోక నాడించుటద్వారా కనుబరచును.

కందరము లెంత గొప్పపనిని జేయుచున్నవో జూచితిరా? వానిపని ఇంత గొప్పదని జెప్ప వీలులేదు. దేవుని గొప్పజ్ఞానము శక్తియు మనకు వీటి ద్వారా తేటపడుట లేదా?

---

# బైబిలు పిల్లలు



బాలమిత్రులారా! దయగల ప్రభువు మనల మరియొక సంతస క్రిస్మసు సమయామువరకు సుఖముగా కాపాడినందులకు ఆయనకు స్తోత్రములు. నేడు క్రిస్మసు దినమును బహు చక్కగా గడిపిన ఇద్దరు మిత్రులనుగూర్చి ధ్యానించుకొందము. ఒక పాఠశాలయందు ఇద్దరు మిత్రు

లుండిరి. వీరు బీదలగుటచేతను తల్లిదండ్రుల ఊరు మిగుల దూరముగ నుండుటచేతను క్రిస్మసు సెలవుదినము గడుపుటకు తమ గృహములకు పోలేకపోయిరి. వీరిరువురిలో నొకరికి వానితండ్రి రెండు రూపాయలు పంపెను. ఇద్దరు స్నేహితులు సంతోషముగా ఆనాడు కొంచెముసేపు బయట తిరిగి ఏమైనకొని తెచ్చుకొందా మనుకొని అంగడిమీదుగా బయలుదేరిరి. త్రోవలో నొక గుడిసె కాలుచుండుటయు అచ్చట వారేమియు తోచక ఇటు అటు తిరుగుటయు కాంచి అచ్చటకు తత్క్షణమే యేగి మంటనార్పి ఆ యింటి బీద ముదుసలికి పండుగ జేసికొమ్మని అర్ధరూపాయనిచ్చి సాగిపోయిరి. మార్గములో బహుసుందరముగా నలంకరించబడియున్న ఇండ్లు మంచి వస్త్రముల ధరించి బహు సంతోషముతో విందులు సలుపుచున్న వారిజూచి వీరు అపరిమిత ఆనందమొందిరి. ఇతరులు సంతోషించుచుండ వారిని అసూయతోజూడక వారితో మనమును కలసి సంతసించుటెంత మంచిది!!

ఇరువురు మిత్రులిట్లు కులాసాగా పోవుచుండ నొక యింటిలో పెద్దపెట్టున ఏడ్పు వినవచ్చెను. అంత వారాయింటికేగి చూడ ఆ ఇంటివారి చిన్నబిడ్డ ప్రభువునందు నిద్రించి యుండెను. వారు కొనుక్కొని చేతబట్టుకొనియున్న లిలియా పుష్పముల నా చిన్నబిడ్డపైనుంచి తలిదండ్రుల నోదార్చి

మరల వెళ్లుచుండిరి. వారికి బలహీనముగాను అనారోగ్యము గానున్న యొకడు కనుబడగా వానికి సహాయముచేసిరి. ఇట్లు వారిచేతనున్న రెండు రూపాయలు నితరులకు సహాయము చేయుటయందు పెచ్చుబెట్టి సంతోషించిరి.

నిజమైనప్రేమ స్వంత అక్కరలను చూచుకొనక యితరుల అక్కరలను తీర్చజూచును. “ దేవుడు లోకమును ప్రేమించెను; ఏలాగున ఆయన తన జనితైక కుమారునియందు విశ్వాస ముంచు ప్రతివాడును నశించక నిత్యజీవమును పొందుటకై ఆయనను అనుగ్రహించెను ” అను వాక్యమును చదివి యున్నారుగదా. ప్రేమించెను. అనుగ్రహించెను. ఇవి రెండును జతగాయుండును. ఒకదానిని విడచి మరియొకటి యుండ లేదు. నాకు ప్రేమయున్నది గాని నేనివ్వలేను అని కొందరను మాటలు వట్టివి. ఈ క్రిస్తసునాడు మన బంధువులను మిత్రులను పొరుగువారిని అక్కరలందును అనారోగ్యముగా యున్నవారిని ప్రేమింతమని నేర్చుకొందము. మన ప్రేమ నిజ మైనదైన అక్కరలం దున్నవారికి యిచ్చుబుద్ధియు యుండి తీరును. ప్రభువు మన కందరికి ప్రేమను ఇచ్చుబుద్ధని అను గ్రహించుగాక !

---

# క్రిస్మసు చెట్టుమీది మైనపువత్తులు

వత్తులు వెలిగించుట యనునది యూదుల ప్రతిష్ఠపండుగులో యొక యాచారమై యుండెను. ఇది క్రిస్మసు కాలములో నాచరించబడెను. మరియు బెత్లెహేమునందు క్రీస్తు పుట్టినసమయమున ప్రతి యూదియ యింటిలో దీపములు వెలుగుచు నుండవచ్చును. ఈ యలవాటు బహుశా క్రైస్తవులు క్రిస్మసు ఆచరించు విధములోనికి మార్చియుండవచ్చును. కొందఱు స్నానికుడైన యోహాను చెప్పినట్లు లోకమునకు రావలసిన వెలుగునకు గురుతుగా స్కాండినేవియా, ఇంగ్లండు, ఇటలి దేశస్థులు యూలియను పండుగులో ఒక మొద్దుకు వెలుగులు పెట్టి కాల్చిన మైనపువత్తులందురు.

---

# శ్రీ క్రిస్మస్

శ్రీయుత క్రిస్టమస్సుధర కేగఁగ నొక్కటఁ వర్షమంతయుం
నాయెడ వృద్ధులంతకడు నాడుదురందియు వారు మోదముల్
బాయక యౌవ్వనస్థులును బాడుదురందఱు సంతసంబునం
ధీయని బాలబాలికలు దివ్వెలతోడుత నాటపాటలన్
హా! యతిఁజల్లకొల్లలుగ నాకడఁ బ్రీతిని శత్రుమిత్రులుం
డాయుచు నొక్కరొక్కరు కరంబులఁగల్పుచు కూడియుందురే.



హా! గురురాజు పుట్టుక దినంబు జయోత్సవతాళ మోతలం
బాగుగ సల్పుదుర్ ఘనులు వారని భక్తిని జూప నెందుకై,
ఈగతిఁ గాక పేదజనులెంచక సంపదలేని క్రైస్తవుల్
బాగుగఁ జేయఁ గ్రీస్తుని బాధ్యులు సాధ్యులఁ గూడి వేడుకన్
శ్రీగుణుఁ డేసు నేఁడులకు నేఁడునటంచుఁ బ్రజాళి గొల్తురే.
క్రీడను గూడ నందఱకుఁ గ్రీస్తుని ప్రార్థన ఘంటశబ్దముల్
లాఁడుఁ బ్రజాళికిం దెలుపు నారసిఁ బోవను దేవళంబుకున్
గూడి గగంబునం ఘనముఁ గూర్చుచు దేవుని దూతజాలముల్
బాడుచు గొల్లబోయలకు భానుఁడు పశ్వులతొట్టిలోన ను
న్నాఁడని జెప్పురీతిని బ్రజాళికిఁ జెప్పును ఘంటశబ్దముల్.
నారయమాఱుగాలి నటనన్ని దినంబులకంటె వేఱుగాఁ
భూరి మహీతలంబుపయిఁ బుట్టిన రాజునకై ముదంబునం
సారసువాసనంబులను సంతసమందదె రాజుపుట్టుకన్
జేరియు, గానహాసనలఁ జేకొనరండయ యాడిపాడుచున్
భూరి ప్రపక్త యాజకుఁడు భూపతి యేసుని వెంబడించుచున్

మారణ లోయలందయిన మాన్యునితోడుత నాటలాడుచున్
సారసమిత్రుతోఁ గలసి సల్పుదమందున రాజ్యపాలనం
భారములేనిసంపదఁ గృపామతినిచ్చుచుఁ గావనీశ్వరున్
భారతభూమిపై చిరనివాసుఁడ బాలుఁడ జీవరత్నమున్
గోరెదఁ సారెసారెకును గూరిమినీశునివేడ నెప్పుడున్.

---

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేను కొంతకాలమునుండి "బాలమిత్ర" యను పత్రికను జదువు చున్నందున నా హృదయము సంతససాగరంబున మునింగినదని జెప్పుటకు సందేహములేదు. ఇందులకై బాల

మిత్ర టప్పాకు యొక చిన్నయుత్తరము వ్రాయవలెనని యనేకపర్యాయములు తలచితిని. నా మిక్కిలి ప్రియ స్నేహితులారా! మనము యీ ప్రపంచమున నివసించు చుండగా ముఖ్యముగా తెలిసికొనవలసిన దేమనిన: "దేవుని ప్రేమ" యని నాకు తోచుచున్నది, దేవుడు నిజముగా ప్రేమయైయున్నాడు. ఆయన నిన్నును నన్నును యొక్క రీతిని ప్రేమించుచున్నాడు. మనకుగల యాహారమును, వస్త్రము లును, మంచిసమయమును, స్నేహితులును, విలువలేని ప్రాణమును, మంచి మనస్సాక్షియు నాయనవై యున్నవి. ఇన్నిటిని దయతో ననుగ్రహించిన మన పరమతండ్రిని మనము ప్రేమించవలెనుగదా? యిప్పటినుండియే మన మందర మాయనను ప్రేమింతుముగాక! ఆయనను నిశ్చయ ముగా ప్రేమించువారిలో పగ, కలహము, కుట్ర, అసూయత మొదలగు పిశాచిగుణము లుండనేరవు. మన మీ చెడుగుణం బులనుండి విడుదలపొంది సర్వశక్తిగల దేవుని ప్రేమించి, ప్రతివారియందు ప్రేమజూప యత్నింతుముగాక! ఇట్టి ప్రేమ మనలో బుట్టింప దేవుని వినయ భయభక్తులతో ప్రార్థింప ప్రార్థించుచున్నాను. దేవునిప్రేమ మనలో వసించునుగాక! మీకందఱకు నాసలాములు.

ఇట్లు మీ స్నేహితుఁడు

ఆర్. మార్టిన్ లూథర్, సికంద్రాబాదు

C. L. S. PRESS, MADRAS—1917

వెనుకవైపున పఠముగల కాగితము నొక అట్టకు అతికించి, ఆలాగుననే ముక్కలు ముక్కలుగా కత్తిరించి వాని చేర్చిపెట్టిన యెడల నేమియగునో జూడుడు. వానినిచేర్చి ఎటువైపున కైనను త్రిప్పవచ్చును.